# శ్రీ భర్గశతకము.



'కవిసార్వభౌమ'

కూచిమంచి తిమ్మకవి.

అముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాల.
ద్వితీయపుష్పము.

శ్రీరామా.

# శ్రీ భర్గశతకము

"కవిసార్వభౌమ"

## కూచిమంచి తిమ్మకవి ప్రణీతము

ప్రకాశకుఁడు

కూచిమంచి శ్రీరామమూర్తి.

మొదటికూర్పు 1000 ప్రతులు.



పిఠాపురము

శ్రీవిద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల.

1936

 వెల 0—4—0

# పీఠిక.

ఈభర్గశతకము "సుకవి—యీశ్వరకారుణ్యకటాక్షలబ్ధకవితా సామ్రాజ్యధౌరేయుఁడును, కౌండిన్యసగోత్రుఁడును, గంగ మంత్రి సుతుఁడును, కూచిమంచి కులుఁడు నైన తిమ్మయభిధా నేంద్రునిచే" రచియింపఁబడినది. ఈకూచిమంచి తిమ్మకవి "రసిక జనమనోభిరామము, అచ్చతెలుఁగురామాయణము" మొదలు గాఁగల యనేకగ్రంథములను విరచించి "కవిసార్వభౌమ" బిరు దము సంపాదించి యాధునిక కవులలో మిక్కిలి పేరుపొందిన వాఁడు. ఈతని జీవితచరిత్రమునుగుఱించియు, కాలనిర్ణయమును గుఱించియు మ.రా.రా.శ్రీ రావుబహాదూరు కందుకూరి వీరేశ లింగముపంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రమున వివర ముగా వ్రాసియున్నారు.

తిమ్మకవి తానీభర్గశతకమును "శాలివాహనశకాబ్దం బుల్ దగన్ యామినీకర బాణాంగ శశాంక సంఖ్యఁ జెలువై కస్పట్టు (సౌమ్యా?) హ్వయ స్ఫురదబ్దంబునఁ" బూర్ణంబు గావించియున్న ట్లిందు వ్రాసికొని యున్నాఁడు. ఈశాలివాహన శకాబ్దము (౧౬౫౧) క్రీస్తుశకము 1729 వ సంవత్సరమునకు సమానమగుచున్నది. కావునఁ దిమ్మకవికాలమును నిర్ణయించుట కింతకంటెఁ బ్రబలమైన వేఱొక యాధారము నరయవలసిన యావశ్యకత గనుపట్టదు.

ఈశతకమున "భర్గా! పార్వతీవల్లభా!" యను మకుటముతో నూటొక్కపద్యములు రచింపఁబడి యున్నవి.

వీనిలోఁ బెక్కుపద్యములు మిక్కిలి మనోహరములుగా నున్నవి. తిమ్మకవి కవిత్వము నిర్దుష్టమై మిగులఁ బ్రౌఢమై మృదుమధురముగా విలసిల్లుచుండు ననెడు సంగతి యాంధ్రులకుఁ బెక్కండ్రకుఁ దెలిసియే యుండనచ్చును.

"క. హాటకగర్భవధూటీ
లాటన చలితాంఘ్రినూపురారావ శ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మాకూచిమంచితిమ్మయమాటల్."

అని ప్రశంసింపఁబడిన యితని కవితాప్రాశస్త్యమును గుఱించి యిప్పుడు వేఱుగాఁ జెప్పవలసిన యక్కఱయుండదు.

ఇంతవఱకు నముద్రితమై తమయింటనున్న యీశతకమును, తిమ్మకవిగారివంశమునఁ దొమ్మిదవతరమువాఁడును, "అముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాలా"స్థాపకుఁడునైన చిరంజీవి కూచిమంచి శ్రీరామమూర్తి తన గ్రంథమాలయందు ద్వితీయపుష్పముగాఁ బ్రకటించి తమపూర్వుల కవితాభాండారము నాంధ్రలోకమునకు సమర్పించి కృతకృత్యుఁ డయ్యెను. మఱియుఁ దమవంశస్థులయొక్కయు నితరులయొక్కయు నముద్రితములై యున్న యిట్టి యుత్తమగ్రంథములను దమగ్రంథమాలయందుఁ బ్రకటించి మాతృభాషాసేవ యొనర్చుటకై శ్రీరామమూర్తికి ఆంధ్రులందఱును దగినప్రోత్సాహ మొనరింతురుగాత!

న. వీ.

# స్వవిషయము



చక్రవర్తి మొదలు నిరుపేదవఱకుఁగల యెల్లజనులహృదయముల రంజింపఁజేయు పొత్తముల వ్రాసి యీ సువిశాల ప్రపంచమున యశఃకాములైన కవిసార్వభౌములఁగన్న ఆంధ్ర మాతకిదివఱకే మాగ్రంథమాలాప్రథమపుష్పముగు కూచిమంచి జగ్గకవి విరచిత భక్తమందారశతక మర్పించుకొంటిమి. అయ్యది యాంధ్రలోకమున నెల్లరచేఁ గొనియాడఁబడుచుండు నని మా యాశయము. అయినను, నేఁటిలోకము నవలాప్రపంచ మగుట కతన గ్రామ్యభాష నుద్ధరింపఁదలఁచిన కవులచే రచితములగు చిత్రవిచిత్రసంఘటనలచే నలరారు నవలలను, ఆదరించుటయు మాపొత్తముల నూలఁ బాఱవైచుటయు సహజమే. కాని, వివిధ భాషలచే నలరారు నీ తెలుఁగుదేశమున నీతిబోధకములగు ప్రాచీన కవి విరచిత పుస్తకముల నభినందించనివా రుండకపోరను దృఢ విశ్వాసముచే నిట్టి యముద్రితగ్రంథముల నచ్చొత్తించి మా విధ్యుక్తధర్మము నెఱవేర్చుకొనుచున్నారము.

మాగ్రంథమాలా ప్రథమపుష్ప మీవఱకే పాఠకలోకమునకు విదితమైనను, అందలి తప్పొప్పుల నొక్కరైన విమర్శింపరైరి. అందులకుఁ గారణ మందలి పీఠికలో భాషాభిమానులెల్లరు తగుసాహాయ్య మొనర్చి నాయుద్యమమును ప్రోత్సహిం

పఁ బ్రార్థితులని వ్రాయఁబడి యుండుటకతన నట్లు ప్రోత్సహించిన నేమి యాశింతుమో యను భీతివలన నుచితముగఁ బొత్తముల బంపించుకొన్నను చేరినవని యైన సెలవిచ్చుట దుస్తరమైనది. అట్లు మేము వ్రాయుట మాయుద్యమమునకుఁ బ్రోత్సాహ కరము కాదని గ్రహింపఁగలిగితిమి. రాజపూజితములేని భాష కిట్టి యథోలోకప్రాప్తియే గలుగుచుండునుగదా ?

అనేకస్థలంబులఁగల లేఖనాదిదోషముల సవరించి, యీ శతకమును బరిష్కరించి, పీఠికను వ్రాసి మాకు నానందమును గూర్చిన పీఠికాపురవాస్తవ్యులు, 'విమర్శాదర్శక' బిరుదాంకితులు మాకు బంధువులునైన మ.రా.రా.శ్రీ నడకుదుటి వీరరాజుపంతు లుగారికి మాకృతజ్ఞతాభివందనము లర్పించుచున్నారము.

ఈభర్గశతకమును ఆంధ్రమాతకు ద్వితీయపుష్పముగ సమర్పించుకొనుచున్నాము. ఈసంవత్సరమున మఱిరెండుపొత్త ముల నచ్చొత్తించి ప్రకటింపఁ బ్రయత్నింతుము. మాగ్రంథ మాలాప్రథమపుష్పమగు భక్తమందారశతకము పీఠికయందలి లోపములు ద్వితీయముద్రణమున సవరింపఁబడును.

అముద్రితాంధ్రగీర్వాణ
గ్రంథమాల, గెద్దనాపల్లి
పెద్దాపురం తాలూకా.
తూర్పుగోదావరిజిల్లా.

ఇట్లు,
భాషాసేవాభిలాషి,
కూచిమంచి శ్రీరామమూర్తి.



# భర్గశతకము

శ్రీకైలాస మహామహీధర శిరః♦శృంగాటకాంచన్మణి
ప్రాకారాంతర చంద్రకాంత రజత♦ప్రాసాదశుద్ధాంత సిం
హాకారోన్నత హేమపీఠమునఁ గొ♦ల్వైయుండు నిన్నెన్నెదన్
రాకాచంద్ర నిభ ప్రభాకలిత! భ♦ర్గా! పార్వతీవల్లభా! 1

మ. క్షితి సంభోనిధి కర్ఘ్యమిచ్చుక్రియ భ♦క్తి న్బదిమ్మనీభర్త కా
రతి యర్పించు శైలింగున న్బహుతర♦బ్రహ్మాండసంత్రాతకున్
శతకంబొక్కటి గూర్చి నీకొసఁగెద♦న్సంయమీడ్యా గైకొమ్ము వా
క్పతి సంస్తుత్యలసద్గుణాభరణ! భ♦ర్గా! పార్వతీవల్లభా! 2

మ. శుక శాండిల్య మృకండు నాత్రి కలశీ♦సూనుల్ భరద్వాజ శౌ
నక వాల్మీకి వసిష్ఠ గర్గ భృగు మాం♦డ వ్యాజసంభూత కౌ
శిక కణ్వాది మహర్షిశేఖరులు నిన్♦ జింతింపఁగా లేరు కొం
కక నే నెంతటివాఁడ నిన్నొగడ భ♦ర్గా! పార్వతీవల్లభా! 3

మ. వర కౌండిన్య సగోత్రపాత్రుని యశో♦వర్ధిష్ణునిం గుక్కుటే
శ్వరకారుణ్యకటాక్షలబ్ధకవితా♦సామ్రాజ్యధౌరేయునిన్
స్థిరపుణ్యుండగు గంగమంత్రిసుతునిన్♦దిమ్మప్రధానేంద్రునిన్
గరుణ న్బ్రోవుము కూచిమంచికులు భ♦ర్గా!పార్వతీవల్లభా!

మ. పరిచుర త్వాంబుగ నెంతునాత్మ నెపుడు • న్స్బత్యూహసంశాంతికై
విచలత్కర్ణ సమీరదూరితమహా • విఘ్నాంబుభృజ్జాలునిన్
రుచిరాస్యాంబురుహాసరివన్మదజల • ప్రోత్సాహలీలాముహుః
పరిచరద్భృంగికులున్ గణాధిపునిభ • ర్గా! పార్వతీవల్లభా! 5

శా. వేమారున్ భవదీయ పావన కళా • విఖ్యాత కావ్యక్రియా
సామీచీన్యవహ్నదంతరాళ కవిరా • ట్సంక్రందన శ్రేణికిన్
సామర్థ్యం బొనగూర్చి మంచినుడువుల్ • సంప్రీతినొందించువా
గ్భామారత్నము లీలమై నిలిచిభ • ర్గా! పార్వతీవల్లభా! 6

మ. చిరభక్తి న్మదిలో భవద్ర్వతముగాం • జింతింతు నశ్రాంతమున్
బరవాదిప్రమదద్విపేంద్రపదవీ • పంచాననశ్రేష్ఠు బం
ధుర తేజోనిధి దెందులూరికుల పా • థోరాశిరాకానిశా
కరునిన్ లింగయసద్గురూత్తముని భ • ర్గా!పార్వతీవల్లభా! 7

మ. పులితోల్ముమ్మెనవాలుపాపతొడవుల్ • భూత్యంగరాగంబుపు
న్కలపేర్లెక్కువకన్ను నీలగళమున్ • గంగావతంసంబు క్రొ
న్నెలపూ వద్రిసుతాసమన్వయము వి • న్కల్గంటు లేజింకయున్
గలనీమూర్తిం దలంతు నెప్పుడును భ • ర్గా!పార్వతీవల్లభా! 8

మ. హర!మృత్యుంజయ!చంద్రశేఖర!విరూ • పాక్షా!మహాదేవ!శం
కర!భూతేశ!మహేశ!రుద్ర!మృడ!గం • గాజూట!గౌరీమనో
హర! సర్వజ్ఞ! బిలేశయాభరణ! శ • ర్వా! నీలకంఠా! శివా!
కరిచర్మాంబర!యంచు నెంతు నిను భ • ర్గా! పార్వతీవల్లభా!9

మ. జగదీశాయ నమోస్తుతే భగవతే♦చంద్రావతంసాయ ప
న్నగహారాయ శివాయ లోకగురవే♦నానామరుద్రూపిణే
నిగమాంతప్రతిపాదితాయ విలస♦న్నిర్వాణనాథాయ ధీ
రగుణాఢ్యాయయటంచు మ్రొక్కెడుదు భ♦ర్గా!పార్వతీవల్లభా!

మ. వ్రతముల్ దేవగురుద్విజార్యపదసే♦వల్ *వైశ్వదేవాది స
త్క్రతుహోమాదులుదానధర్మములువై♦రాగ్యప్రచారంబులా
శ్రితరక్షావిధు లించుకే నెఱుఁగ నీ♦చిత్తంబు నాభాగ్య మే
గతి రక్షించెదొ కాని న న్నిఁకను భ♦ర్గా!పార్వతీవల్లభా! 11

మ. మరుదర్కేందుకృశానుయజ్వగగనాం♦భఃకుంభినీమూర్తి నం
బరకేశున్ శరణాగతార్తిహరణు♦న్బాలేందుచూడామణిన్
ధరణీభృత్తనయా స్తనద్వయమిళ♦త్కస్తూరికాపంకసం
కరదోరంతరు నిన్ భజించెదను భ♦ర్గా! పార్వతీవల్లభా! 12

మ. మిహిరప్రోద్భవఘోరకింకరసము♦న్మేషోరగశ్రేణికా
విహగోత్తంస మశేషదోషపటలీ♦వేదండకంఠీరవం
బహితక్రూరగదాటవీహుతవహం♦బైనట్టి పంచాక్షరం
బహాహా!కల్గెను నాకు భాగ్యమున భ♦ర్గా!పార్వతీవల్లభా!13

మ. నృపసేవాపరకామినీపరధన♦ప్రేమాతిరేకంబు లో
క్కపుడుం గూర్పక తావకీనపదప♦ద్మారాధనేచ్ఛారతుల్
కృపదైవాఱ నొసంగి భక్తవరుగా♦నేప్రొద్దు న న్బ్రోవుమీ
కపటారాతినిశాటసంహరణ!భ♦ర్గా!పార్వతీవల్లభా! 14

---

* దానధర్మా—పునరుక్తము

మ. అభవున్ శాశ్వతు నాద్యు నక్షయుని నవ్యక్తుంబరేశు న్మహా
ప్రభు నాద్యంతవిహీను భూతమయు సర్వజ్ఞున్ గుణాతీతుఁ బ
ద్మభవాండోదరునాత్మరూపభవు నద్వంద్వుంజిదానందునిన్
రభసం బొప్పఁ దలంతు ని న్నెపుడు భర్గా!పార్వతీవల్లభా!

మ. తనర న్ని న్మది నెంతు నెప్పుడును నాదైవంబుగా దాతఁగా
జనకుంగాఁ జెలికానిఁగా గురువుఁగా సద్బంధుఁగా నన్నఁగా
ఘననిక్షేపముఁగా మహాప్రభునిగాఁ గళ్యాణసంధాయిఁగాఁ
గనకోర్వీధరకార్ముకోల్లసితభ! ర్గా! పార్వతీవల్లభా! 16

మ. ప్రతివారంబు శివోహమస్మి యనుచు న్భావింతు గంగాధర
స్తుతు లెల్లప్పుడుఁ జేతు శంకరకథల్ సొంపార నాలింతు నా
యతబుద్ధిన్ జగమెల్ల నీశ్వరమయం బంచు న్విచారింతు నే
గతి రక్షించెదొ కాని నీవు నను భర్గా! పార్వతీవల్లభా !

మ. పురుహూతాగ్ని పరేతరాట్పలభుగంభోధీశవాతార్థపాం
బరకేశాబ్జభవాచ్యుతాదికమహాబర్హిర్ముఖానేక భా
స్వర కార్తస్వర విస్ఫురన్మకుటశశ్వత్పద్మరాగప్రభో
త్కర నీరాజితపాదపంకరుహా! భర్గా! పార్వతీవల్లభా! 18

శా. వ్యాకీర్ణాచ్ఛజటాటవీతట నితాంతాలంబితోద్వృత్తమి
స్త్రీకాంతిప్రథితప్రభాసముదయా శాంతప్రఫుల్లన్మహా
నాకద్వీపవతీవినిర్మల జలాంతర్భాగభా గ్దివ్యరే
ఖాకాంతోత్పలకైరవప్రకర! భర్గా! పార్వతీవల్లభా! 19

మ. సతతానందితసర్గ! సర్వసుమన♦స్సంస్తుత్యసన్మార్గ! యా
శ్రితకారుణ్యనిసర్గ! రాజతధరి♦త్రీభృన్మహాదుర్గ! హృ
త్కృతుకాలింగితదుర్గ! సంహృతసమి♦ద్ఘోరద్విషద్వర్గ! సం
యత నీరంధ్ర సుఖాపవర్గ! జయ! భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. పురరక్షఃపటుతూలహవ్యవహా! వి♦స్ఫూర్జద్రురుక్రూరగో
పరిపంథిక్షణదాచరోరగ మహా♦పక్షీంద్ర! ఘోరాంధకా
సురగంధద్విరదేంద్రపంచముఖ! య♦క్షుద్రప్రభావోల్లస
త్కరిలేఖద్విషదభ్రగంధవహా! భ♦ర్గా! పార్వతీవల్లభా! 21

మ. అమరాహార్యము విల్లుగా, ఫణికులా♦ధ్యక్షుండు తన్మౌర్విగాఁ
గమలాధీశుఁడు తూపుగా, నిగమముల్♦గంధర్వముల్ గాఁగ, స
ర్వమహీచక్రముఁ దేరుఁ జేసి విధి సా♦రథ్యంబుమీఱం బరా
క్రమలీలన్ దిగప్రోళ్లఁ గూల్చితివి భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. కోటీరాంగదమేఖలాఘుసతులా♦కోటీ కవాటీనట
ద్ఘోటీ హాటకపేటికాభటవధూ♦కోటీనటాందోళికా
వీటీనాటక చేటికాంబరతతుల్ ♦ వే చేకుఱు న్ని న్నిరా
ఘాటప్రౌఢి భజించు ధన్యులకు భ♦ర్గా! పార్వతీవల్లభా! 23

శా. కంఠేకాలుఁ డటంచు నిన్నెపుడు లో♦కవ్రాత మగ్గింప. వై
కుంఠేంద్రాంబుజసంభవప్రముఖులం ♦ గోలాహలప్రక్రియం
గుంఠీభూతులఁ జేయు దుర్భయదకా♦కోలంబు హేలాగతిన్
గంఠాగ్రంబునఁ బూనినాఁడ వఁట భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. నిను డెందంబునఁ జేరికింగొనక వా♦ణీనాథజంభద్విష
ద్దనుజారిప్రముఖాఖిలామరతతిన్ ♦దట్టంబుగాఁ గూర్చి యా
మున జన్నం బొనరించుదక్షుని దురా♦త్ము న్వీరభద్రోగ్రసం
హననం బూని వధించి తౌర! భళి! భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. కిరిహంసాకృతు లూని వెన్నుఁడును బం♦కేజాతగర్భుండు నీ
చరణంబుల్ శిరము న్గనం దలఁచి ని♦చ్చల్భోగిలోకంబు, పు
ష్కరమార్గంబును రోసి కానక నిరా♦శం జెందు వో వారలం
గరుణం బ్రోవవె లింగమూర్తి వయి? భ♦ర్గా!పార్వతీవల్లభా!

మ. తరమే యేరికిఁ దావకీనఘనని♦త్యశ్రీవిలాసక్రియల్
గరిమ న్దెల్పఁగ? దారుకావనిని లో♦కఖ్యాతిగా వర్ణివై
పరమానందరసార్ద్రమానసుఁడవై ♦ పల్మారు గ్రీడించితౌ
నరుదార న్మునిదారలం గలసి భ♦ర్గా! పార్వతీవల్లభా! 27

మ. హరికన్న న్మతి దైవ మెవ్వఁడును లేఁ♦డంచు న్భుజంబెత్తి ని
ర్భరగర్వోద్ధతిఁ గాశికానగరిలోఁ ♦ బల్మారు వాదించు ని
ష్ఠురవాగ్ఘోషరతుం బరాశరసుతున్ ♦ స్రుక్కింపవే భీమవై
ఖరి దోః స్తంభన మాచరించి మును భ♦ర్గా!పార్వతీవల్లభా!28

మ. దనుజారాతిమృదంగమున్నలువకై ♦తాళంబుగోత్రాహితుం
డెనయ న్వేణువు వాణి వీణయునువా♦యింపన్ రమాకాంతనే
ర్పున గానం బొనరింప సంజతటి వే♦ల్పుల్మెచ్చఁగా హాళివై
ఘనతన్ దాండవకేళి సేయుదఁట! భ♦ర్గా! పార్వతీవల్లభా!29

శా. నీలాంభోధరమధ్యసంస్థితతటి♦న్నీకాశమై విస్ఫుర
ల్లీల న్నీవారశూకచండిమున నెం♦తే సూక్ష్మమై పచ్చనై
చాలన్భాసిలు తేజమీవయనుచు♦న్స్వాంతంబునం దెన్ను దుర్
వాలెంబున్ ఘనులైన తాపసులు భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. గొనబార న్వటజంగమాకృతిని మున్♦గొం కేది భల్లాణరా
యనిసద్మంబున కేఁగి యాతనిసతి♦న్బ్రార్థించి యాలేమయ
క్కునఁ జక్క న్నెలనాళ్ల బాలకుఁడవై♦గోమొప్పఁగన్బట్టితౌఁ
గన నబ్రంబులు నీవిహారములు భ♦ర్గా! పార్వతీవల్లభా! 31

మ. యమరాట్భీకరకాలపాశమహతుం♦డై శ్వేతకేతుండు దు
ర్దమశోకాకులచిత్తవృత్తి మెయిని♦న్బ్రార్థింప వైళంబ యా
శమనుం గ్రొవ్వణఁ దన్ని మౌనితనయున్♦శశ్వద్గతిన్బ్రోవవే
కమలేశార్చితపాదపంకరుహా! భ♦ర్గా! పార్వతీవల్లభా! 32

మ. త్రిజగద్రక్షణశక్తిఁ గోరి కమలా♦ధీశుండు నిన్వేయి పం
కజసత్త్రంబులఁ బూజసేయు నెడ నొ♦క్కండు లేకుండినన్
నిజనేత్రాబ్జ మతం డొసంగినఁ గృప♦న్వీక్షించితౌఁ జక్రమ
క్కజ మొప్పారఁగ నిచ్చి యేలుకొని భ♦ర్గా!పార్వతీవల్లభా!

మ. చిరితొండం డను భక్తునింటికిహరా యల్♦చెన్నారవేంచేసి త
ద్వరపుత్రున్ దునిమించి నంజుడుతు నె♦ల్వండించి భక్షించుచో
సిరి యొప్ప న్నిజమూర్తిఁ జూపి యతనిన్♦జేపట్టి రక్షింపవే
కరిదైత్యాధమగర్వనిర్మథన! భ♦ర్గా! పార్వతీవల్లభా! 34

మ. విజయుం డుగ్రవిపక్షశిక్షణకళా♦వృత్తి న్నిమం గోరి య
క్కజ మొప్పన్ దప మింద్రకీలశిఖరిన్♦గావించుచో బోయవై
విజయఖ్యాతిగఁ బోరి పాశుపత మీ♦వే వాని కిష్టంబుగా
రజతక్షోణిధరాగ్రసద్భవన! భ♦ర్గా! పార్వతీవల్లభా! 35

మ. తనకున్ మిక్కిలి ముజ్జగంబుల కెఁకన్♦దైవంబు లేఁడంచుఁ బా
యనిదర్పంబున దైత్యదానవమునీం♦ద్రామర్త్యసంసత్పదం
బున వాదించు విరించి పంచమమహా♦మూర్ధంబు ఖండింపవే
కన సత్యుద్ధతభైరవాకృతిని భ♦ర్గా! పార్వతీవల్లభా! 36

మ. సకలాధీశుఁడ వెన్న నీవొకఁడవే♦సత్యంబు సత్యంబు కొం
చక యంతర్బహిరుజ్జ్వలద్భువనర♦క్షాదీక్షఁ గాకోల ము
త్సుకతం గంఠమునందుఁ గ్రాల్చితివి మె♦చ్చుల్మీఱఁ గ్రూరాత్ములై
యకటా! మూఢు లెఱుంగఁజాల రిది భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. ఏరీ నీ కెనయైన దైవతము లీ♦యీరేడులోకంబులన్
గారామార మృకండుసూనుఁడు మహో♦గ్రక్రూరమృత్యువ్యథా
భీరుండై శరణన్న మిత్తి నపుడే ♦ పెంపార్చి రక్షించి త
య్యారే! శాశ్వతజీవిగా సతసి భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. లోకశ్రేణికి నీవె కర్తవను టా♦లోకింప నిక్కంబె పో
వైకుంఠాధిపుఁడైన శౌరి దినరా♦డ్వంశంబునన్ రాఘవుం
డై కన్పట్టి జగద్ధితంబుగ ససం♦ఖ్యన్ శంభులింగంబులన్
వ్యాకీర్ణేచ్ఛఁ బ్రతిష్ఠ చేసెఁగద భ♦ర్గా! పార్వతీవల్లభా! 39

మ. శిలలన్ బూన్చియుఁ జెప్పుఁగాలనుగడు ♦ జిత్రంబుగాఁ ద్రొక్కియున్
నెలి నెట్టించియుఁ గుంటెనల్లడపియు ♦ న్వేరోఁకటం గ్రుమ్మియు
న్నిలయద్వారమునందుఁ గాఁపునిచియున్ ♦ నీవారలై నారు వా
రలభాగ్యం బిఁక నేమిచెప్పనగు? భర్గా! పార్వతీవల్లభా! 40

మ. అజినంబుస్స్రమఘోటియుం బునుకలు ♦ న్హాలాహలంబు న్మహా
భుజగంబు ల్భవభస్మముం గ్గాఅలఁగా ♦ భూతాళితో నుండియున్
ద్విజగన్నంగిళదాయకాన్కృతిఁ గడున్ ♦ దీపించు టబ్బెం బహా
రజనీనాథకళాశిరోభరణ! భర్గా! పార్వతీవల్లభా! 41

శా. ఛాయానాదయటంచ్రము మాద్యశులు చం♦డాలాదులన్నాసినన్
బాయుంబుణ్యచయంబులంచుఁ జదువు ♦ ల్పల్కంగనీవయ్యయో
బోయం జెంగిలిమాంసమిచ్చుటకులో ♦ బుల్బానిచేకొంటి వే
పాయస్స్రత్తము కద్దటీని కిఁక? భర్గా! పార్వతీవల్లభా! 42

శా. భంజింమంగిచ! ఘోరనుష్కృతితతిన్ ♦ భస్మత్రిపుండ్రంబుల
న్మంజుశ్రీలలితాక్షమాలికలఁ బ్రే♦మం బూని సద్భక్తి నీ
కుం జేమోడ్చు మహానుభావుఁ డెపుడుం ♦ గుక్షిస్థలప్రోల్లస
త్కుంజాండపరిభవాండభాండచయ! భర్గా! పార్వతీవల్లభా! 43

శా. శ్రీశైలంబును గుంభఘోణమును గాం♦చీస్థాన కేదారముల్
కాశీద్వారవతీప్రయాగములు నీ♦లక్ష్మాధరావంతికల్
లేశంబున్ ఫలమీవు నిన్నెపుడు హా♦లింగోల్వలేకున్నచోఁ
గాశాకాశధునీఘనాభరణ! భర్గా! పార్వతీవల్లభా! 44

శా. కావేరీ సరయూ మహేంద్రతనయా♦గంగా కళిందాత్మజా
రేవా వేత్రవతీ సరస్వతుల క♦ర్థింబోవఁగా నేల నీ
సేవానంస్మరణార్చనాదు లెపుడున్♦సిద్ధించు మర్త్యాళికిన్
శ్రైవీభూతిభుజంగమప్రవర! భ♦ర్గా! పార్వతీవల్లభా! 45

మ. అరిషడ్వర్గముఁ ద్రోలి సర్వహితులై♦యష్టాంగయోగక్రియా
పరులై గాఢ్వజయించిముద్రవెలయన్♦బ్రహ్మంబునీక్షించివా
విరి సోహమ్మని యెంచుచుండెడిమహా♦వేదాంతులౌ యోగిశే
ఖరులెల్లన్ మిముఁ గాంచుచుందురుగదా? భ♦ర్గా!పార్వతీవల్లభా!

మ. తలపోయన్ దిలజాలకాంతరమహా♦తైలంబుచందానఁ బూ
సలలో దారముపోల్కి నాత్మమయతన్♦సర్వాంతరస్థాయివై
విలసల్లీలల నిండియుండుకొను ని♦న్వీక్షింపఁగా నేర్చువా
రలె ధన్యుల్ గదా? ముజ్జగంబులను భర్గా!పార్వతీవల్లభా! 47

శా. ఏణాంకుండొకఁడై పయోఘటములం♦దెల్ల న్బహుత్వంబుచే
రాణం బొల్చు తెఱంగునం బృథుతర♦బ్రహ్మాండభాండాంతర
ప్రాణిశ్రేణులయందు నీ వొకఁడవే ♦ రాణింతువౌ సర్వగీ
ర్వాణస్తుత్యచరిత్ర! యాత్మమయ!భ♦ర్గా!పార్వతీవల్లభా!48

శా. ఓంకారప్రముఖాక్షరోచ్చరణ సం♦యోగంబు గావేన్ముఖా
లంకారార్థము, శబ్దబింబకళలున్♦లక్ష్యప్రయోగక్రియల్
పొంకంబౌగురుమార్గముక్ యతిగతిం♦బోమమ్కృతింబోలిసా
హంకారుండయి ప్రాకృతుండు చెడు భ♦ర్గా!పార్వతీవల్లభా!

మ. అకలంకం బతులం బఖండ మమృతం బానందకందం బనూ
నక మాద్యంతవిహీన మక్షర మనంతం బప్రమేయం బరూ
పక మవ్యక్త మచింత్య మద్వయము నే బ్రహ్మంబు నీవంచుఁ గొం
కక లోఁ గన్గొనువారు బల్లిదులు భర్గా! పార్వతీవల్లభా! 50

శా. ఆకుల్ మెక్కదె మేఁక? చెట్టుకొననో య్యాన్ వ్రేలదే పక్షి? పె
న్నాకుల్ గ్రుంకవె నీట? గాలిఁ గొనదే నాగంబు? బల్గొందులన్
ఘూకంబుండదె? కోనలం దిరుగదే క్రోడంబు? నిన్ గాంచినన్
గా కిన్నింటను ముక్తి చేకుఱునె? భర్గా! పార్వతీవల్లభా! 51

మ. ధర మృద్దారుశిలామయప్రతిమలన్ దైవంబు లంచుం బర
స్పరవాదంబులఁ బోరుచున్ నిబిడసంసారాంధులై మేలు చే
కుఱ కే మార్గముఁ గాని కండెలగతిన్ ఘోరార్తులై ప్రాకృతుల్
కరముం జచ్చుచుఁ బుట్టుచుందు రిగదా? భర్గా! పార్వతీవల్లభా!

మ. జననీగర్భమహామహోగ్రనరకస్థానవ్యథం గొన్ని నా
ళ్లనయన్ బాల్యకుమారతాదశలఁ గొన్నేఁడుల్ వధూమీనకే
తనగేహాభ్రమఁ గొన్ని నాళ్లు ఘనవృద్ధప్రాప్తిఁ గొన్నేళ్లుఁ బా
యని దుఃఖంబులఁ బ్రాణి గుందుఁగదె? భర్గా! పార్వతీవల్లభా!

శా. కేదారాదిక పుణ్యభూముల కశక్తిం బోవఁగా రాదు; బల్
పేదర్కంబున దానధర్మవిధు లోలిం జేయఁగా రాదు గా
కేదే నొక్కతఱిన్ సమస్తభువనాధీశున్ నినుం గొల్వఁగా
రాదో? కానరుగాక దుర్మతులు భర్గా! పార్వతీవల్లభా! 54

మ. తరుణీకుంభదురోజకుంభములపై ♦ధమ్మిల్లబంధంబుపైఁ
గరమూలంబులపైఁ గపోలములపైఁ ♦గందోయిపై మోముపై
నిరతంబున్ విహరించు చిత్త మెపుడున్ ♦నీయందొకప్డైనిఁ జే
ర్పరుగా మూఢుల దేమిదుష్కృతమొ? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. మిము నొక్కప్పుడుఁ గొల్వనేరక వృథా♦మిథ్యాప్రచారంబులం
గములై వాఁగులయందు నెల్లమునుఁగం♦గాఁ బుణ్యములేస్రునే!
తిమి సత్రశాంతము నీటఁ గ్రుంకులిడి యే♦ధర్మంబు లార్జించెనో
కమఠగ్రాహ ఝులీకుళీరములు! భ♦ర్గా! పార్వతీవల్లభా! 56

మ. హరి దైవంబు; విరించి సర్వభువనా♦ధ్యక్షుండు బృందారకే
శ్వరుఁ డాఢ్యుండు హుతాశనుండు పతిభా♦స్వంతుండు వేల్పింద్రు
లో! నరయన్నెరరుగా శివాత్పరతరం♦నాస్తీతి వాక్యార్థమే
కరణిం గోవిదులైరొ కాని మఱి! భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. వేయేనూఱు పురాణముల్ సదివినన్ ♦వేదాంతముల్ గన్న నా
మ్నాయంబుల్ పరికించినన్ స్మృతులు వే♦మాఱుల్ విమర్శించిన
న్నీయందాఢ్యత దోఁచుచున్న యదివో!♦నిక్కంబు భావింపఁగా
గాయత్రీపతివై తనర్చుటను భ♦ర్గా! పార్వతీవల్లభా! 58

శా. అఘుంటాపథపద్ధతిన్ శివ శివే♦త్యాలాపసంశీలులై
రేఘుస్రంబులు ద్రోచు పుణ్యతములు♦ర్వీన్ బ్రహ్మహత్యాద్యనే
కాఘౌఘంబులు వాసి తానకపద♦ప్రాప్తిన్ విడంబింతురో!
ద్రాఘిష్ఠప్రభుతాగుణోల్లసన! భ♦ర్గా! పార్వతీవల్లభా! 59

మ. పృథివిన్ మర్త్యుఁ డొకప్డు నీశిరముపై ♦ బిల్వీదళంబొక్కఁట
త్యధికాహ్లాదముతోడ నిడ్డ నదియా♦హా!ఘోటకాందోళికా
రథనాగాంబరపుత్రపౌత్రవనితా♦రత్నాదులై యొప్పుఁబో
ప్రథితాదభ్రసితాభ్రశుభ్రయశ! భ♦ర్గా! పార్వతీవల్లభా!60

మ. మిము సేవించుటచేతఁగాదె చిరల♦క్ష్మీసంగతుల్ శౌరికిన్
నముచిద్వేషికి శాశ్వతస్థితమహా♦నాకాధిపత్యంబు, వా
గ్రమణీభర్త కశేషసృష్టిరచనా♦ప్రావీణ్యమున్ గల్గె ? నీ
క్రమ మజ్ఞుల్ గనలేరుగాని భువి భ♦ర్గా!పార్వతీవల్లభా! 61

శా. వాణీశాంబుజలోచనప్రముఖ గీ♦ర్వాణార్చితాంఘ్రిద్వయున్
క్షోణీభాగశతాంగునిన్ గజహరున్♦శ్రుత్యంతవేద్యున్ నినున్
బాణాదిప్రమథోత్తముల్ గొలిచి మే♦ల్పట్టూసిరా సంతత
ప్రాణివ్యూహమనోంబురుడ్భవన! భ♦ర్గా!పార్వతీవల్లభా! 62

శా.దారిద్ర్యంబుదొలంగు, మృత్యువెడలున్♦దవ్వౌనఘవ్రాతము
ల్ఘోరవ్యాధులు గండదోషము లడం♦గున్ జారచోరవ్యథల్
దూరంబౌ, నహితానలగ్రహగణా♦ర్తుల్ వీడు నిక్కంబు నీ
కారుణ్యం బొకయింత గల్గునెడ భ♦ర్గా! పార్వతీవల్లభా! 63

మ. సుత, పద్మాకర, దేవతాగృహ, వన,♦క్షోణీసురోద్వాహ, స
త్కృతి, నిక్షేపము లంచు నెంచ నలువౌ♦నీసప్తసంతానముల్
హితవారంగనొనర్చుపుణ్యమెనయున్♦హేలాగతిన్మర్త్యుఁడౌ
క్కృతటిన్ మిమ్ముఁదలంచెనేసి మది భ♦ర్గా ! పార్వతీవల్లభా!

మ. అమరం ద్వత్పదపంకజాతయుగళ • ధ్యానక్రియాక్రాంతసం
భ్రమలీలన్ విలసిల్లుడెంద మొరులన్ • బ్రార్థింపఁగా నేర్చునే?
సుమనోనిర్ఝరిణీసువర్ణకమల • స్తోమాసవాలంపట
భ్రమరం బేఁగునె తుమ్మకొమ్మలకు భ • ర్గా! పార్వతీవల్లభా!

మ. శివుఁజూడం దగదంద్రుఁ గొందఱధముల్ • చిత్రంబు తా రెన్నఁడున్
రవిచంద్రాగ్నిగృహేడ్యమాపవనసీ • రవ్యోమముల్ నీస్వరూ
పవిశేషంబు లటంచుఁ దెల్ప వినరో • భావింప సమ్యగ్విధం
గవు లెల్లం దవధీనతన్ మనరో భ • ర్గా! పార్వతీవల్లభా! 68

మ. ద్విపగంధర్వవిభూషణాంబరవధూ • వీటీభటాందోళికా
తపనీయాదులచేఁ గ మత్తిలి బుధేం • ద్రశ్రేణి బీడింతురా
తపనపోద్భవఘోరకింకరగదా • దండోగ్రదుఃఖంబు లో
కృపుడుం దుష్ప్రభులేల యెంచరొకో? భ • ర్గా! పార్వతీవల్లభా!

శా. నానాద్వీపధరాధురావహసమా • స్యస్ఫారబాహాబలా
నూనఖ్యాతిసమేతు లైన కోశలింఁ • దుష్మ్మాతలేశాదిక
క్ష్మానాథు ల్చనిపోవుట ల్దెలియరో • సత్యంబులా దేహముల్?
కానంజాలరుగాక దుర్నృపులు భ • ర్గా! పార్వతీవల్లభా! 68

మ. చవిలేల్ కాసులు వీసముల్ గొని యథే • చ్ఛాలీలలం బ్రేలుదు
ష్కవులన్మెచ్చుచు భవ్యకావ్యఘటనా • శాలుల్ ప్రసంగించుచో
నవివేకక్షితినాయకాధమవరుల్ • హాస్యోక్తులం బొల్తురా
కవితాసార మెఱుంగఁ గండుటను భ • ర్గా! పార్వతీవల్లభా! 69

మ. చెలుల న్బంధుల విప్రులన్ బ్రజల దా◆సీభృత్యమిత్రాదులం
గలవిత్తంబులు పృష్ఠులుం గొని కడున్◆గారింతు రధ్యక్షతం
దలపం జాల రదేమొ మీఁదటికిఁ గల్◆ దర్పాంధకారాంధులై
కల నైనన్ మహిభృన్మహాత్మకులు భ◆ర్గా! పార్వతీవల్లభా!

శా. మన్నెల్లం దమసొమ్ము లంచు వసుధా◆మర్త్యోత్తమక్షేత్రముల్
కన్నారం గని యోర్వలేక దిగమ్రిం◆గం జూతు రల్పప్రభుల్
వెన్నప్పంబులొ బూరెలో వడలొ భా◆వింపంగ నొబ్బట్లొకో
యన్నా! యెన్నఁగ వారిపాలి కవి? భ◆ర్గా! పార్వతీవల్లభా!

మ. ప్రజలం గాఱియఁబెట్టి పెట్టియల స◆ర్థంబెప్పుడు న్నించుచున్
ద్విజవిద్వత్కవివందిగాయకుల కే◆దే నొక్కటీలేక య
క్కజమొప్పం బలుమూలలం దిరుగు భూ◆కాంతాళికిం గీర్తిధ
ర్మజగద్ఘాధత్వము లేక్రియం గలుగు? భ◆ర్గా! పార్వతీవల్లభా!

శా. ఆజిన్ వైరివరూధినీఘనదీ◆తూరూషిఁ గ్రాలన్ వలెన్
భోజుంబోలి సమస్తయాచకతతిం ◆ బోషించుచుండన్ వలెన్
తేజం బెప్పుడు నుర్విలోఁ బ్రజకుఁ జెం◆దిపన్ వలెన్ గానిచో
రాజా వాఁడు? తరాజుగాక! భువి, భ◆ర్గా! పార్వతీవల్లభా!

శా. తేజంబొప్పఁ బురాకృతంబున జగ◆ద్ధ్యేయత్వదంఘ్రిద్వయీ
పూజాపుణ్యఫలంబునం దమ రిటుల్◆భూపత్వముం గంటకున్
వ్యాజంబూనికముం జెషంగవలెనా◆యూలింపరా యీనృపుల్
"రాజాంతే నరకం వ్రజే" త్తనుట? భ◆ర్గా! పార్వతీవల్లభా!

మ. కవివిద్వద్ధరణీసుధాశనవరుల్ ♦ కార్యార్థులై యొద్ద డా
సి వడిం జేతులుదోయిలించుకొని యా♦శీర్వాదముల్సేయ నె
క్కువదర్పంబున నట్టిటుం బొరలకే ♦ క్రొర్మి గ్రింగిన ట్లుండు గ్రా
రవళిం దుర్నృపు లేమియీయఁగలరో భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. గాజుంబూస యనర్ఘరత్నమగునా?♦కాకంబు రాయంచయౌ
నా? జోరీఁగ మధువ్రతేంద్రమగునా?♦ నట్టెన్మ పంచాస్యమౌ
నా? జిల్లేడు సురావనీజ మగునా? ♦ నానాదిగంతంబులన్
రాజైనా ఘనలోభిదుర్జనుఁడు? భ♦ర్గా! పార్వతీవల్లభా! 76

శా. కోపంబెక్కువ, తాల్మియిల్ల, పరుషో♦క్తుల్ పెల్లు, సత్యంబుతీల్,
కాపట్యంబుఘనంబు, లోభమునహం♦కారంబుదట్టంబు, హ్రా
చ్చాపల్యం బధికంబు, ద్రోహ మతివి♦స్తారంబు, ఛీ! యిట్టిదు
ర్వ్యాపారప్రభు లేరిఁ బ్రోతు రిఁక భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. హృద్వీథిం గనరుం దిరస్కృతియు బి♦ట్టేపార నొక్కప్పుడున్
సద్వాక్యంబును దర్శనం బిడని రా♦జశ్రేణి కాఁగింతురా
"విద్వద్దండమగౌరవం"బనుస్మృతుల్ ♦వీక్షింపరా దుర్నృపా
గ్రద్వారంబుల వ్రేలు పండితులు? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. అపవర్గం బొనగూడునో చిరసుఖా♦హ్లాదంబు చేకూరునో
జపహోమాధ్యయనార్చనాదికమహా♦షట్కర్మముల్డించి దు
ష్టపటోపాయవిజృంభమాణధరణీ♦కాంతాధమాగారని
ష్ఠ పట భ్రాంతి జరింతు రార్యు లిల భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. అకటా! జుత్తెఁడుపొట్టకై కృపణమ♦ర్త్యాధీశగేహాంగణా
వకరక్షోణిరజశ్ఛటావిరతసం♦వ్యాప్తాంగులై కుఱింగి నె
మ్మొకముల్ వెల్వెలఁబాఱ వ్రేలుదురదే♦మో యెందులంబోవ నే
రక ధీమజ్జను లెంత బేలలొకొ! భ♦ర్గా! పార్వతీవల్లభా 80

మ. అతిలోభిన్ రవిసూనుఁడంచుఁ గపట♦స్వాంతున్ హరిశ్చంద్రభూ
పతియంచున్ మిగులంగురూపిని నవ♦ప్రద్యుమ్నుఁడంచు న్మహా
పతితున్ ధర్మజుఁడంచు సాధ్వసమతిం♦ బార్థుండటంచు న్బుధుల్
ప్రతివేళన్ వినుతింతు రక్కటను భ♦ర్గా! పార్వతీవల్లభా!81

మ. జనసంస్తుత్యమహాప్రబంధఘటనా♦సామర్థ్యముల్ గల్గు స
జ్జను లత్యల్పుల దీనతం బొగడుదుర్♦జాత్యంధతం జెందికా
కనుపొప్పందము గన్నఁడున్ "సుకవితా♦యద్యస్తి రాజ్యేనకి"
మ్మను వాక్యంబు వినంగలేదొ మును? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. సుగుణోద్దామమహాకవీంద్రఘటితా♦త్యుద్రప్రబంధావళుల్
జగదుద్దండపరాక్రమక్రమ విరాజ♦ద్భూమి భృన్మౌళికిన్
దగుఁగా కల్పుల కొప్పునే? కరకి ము♦క్తాకాయమానంబు సొం
పగుఁగా కొప్పునె యూరఁబందులకు? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. పటులోభాత్మున కెవ్వరైనఁ గడకం♦బద్యాదు లర్పించినం
గుటిలుండై యవియెల్ల నిల్పుకొనఁగాఁ♦గోరండు నిక్కంబ హా!
దిట మొప్పారఁగ నిల్పుకోఁగలదె ధా♦త్రిన్ గొంతసేపైన మ
ర్కటపోతం బురురత్నహారములు? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. భువిలో మేదరసెట్టి చిప్పతడకల్ ♦ పాంకంబుగా నల్లి పె
ప్రవళిన్ సంతలనెల్లఁద్రిప్పు క్రియ దై♦న్యంబెచ్చఁగా దుష్టవుల్
తివుటొప్పం జెడుకబ్బపుందడక లో♦లిం ద్రిప్పఁగా నద్దిరా!
కవితల్ కాసుకు గంపెఁడయ్యెఁగద భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. అవివేకక్షితినాయకాధమసభా♦భ్యాస ప్రదేశంబులన్
బవళు ఱేలును జుట్టఁబెట్టుకొని దు♦ష్పాండిత్యముల్చూపుచుం
గవిముఖ్యుం బొడగాంచి జాఱుదురు వే♦గం; బుండవిల్గన్న కా
కవులట్లే నిలఁబోక కాకవులు భ♦ర్గా! పార్వతీవల్లభా! 86

మ. భువిలో నిక్కలిదోషహేతుకమునం♦బొల్పారి గోసంగులున్
బవినాలున్బలుమోటకాఁపుదొరలుం♦ బాషండులు న్దాసరుల్
సివసత్తుల్ నెఱిబోయపెద్దలును దా♦సేయప్రభుల్ దుష్టకా
కవులు న్మీఱితి రిఁకేమి చెప్పనగు? భ♦ర్గా! పార్వతీవల్లభా! 87

మ. కలుముల్నిక్కమటంచు నమ్మితులువ♦ల్గర్వాంధులై యెన్నఁడు
న్బలిభిక్షంబులు వెట్టకుండ్రు పిదప♦న్బ్రాణంబులం బాసియూ
ఖలులేమాదురొ, వాండ్రుగూరి వినరో♦ క్షంబెల్ల నేమానొకో
కలుషోద్గాఢతమస్సహస్రకర ! భ♦ర్గా ! పార్వతీవల్లభా! 88

మ. తులువల్పెట్ట భుజింపలేక ధనమెం♦తో నెమ్మదిం గూర్చి మూ
లల దట్టంబుగఁ బాఁతుకొన్న నృపతు♦ల్వాలెంబు నిర్మోహులై
పలుచందంబులఁ గట్టి కొట్టి మిగుల♦న్బాధించి రోధించుచుం
గలసొమ్మెల్ల హరించుచుండ్రుగద! భ♦ర్గా ! పార్వతీవల్లభా!

మ. చెనఁటుల్గూర్చుధనంబుమ్రుచ్చులకు దా♦సీవారయోషావహు
తాశన దుష్టక్షితిపాలక ప్రతతికిన్ ♦ సంరూఢిఁ జేకూరుఁగా,
కనవద్యప్రతిభావిభాసిత బుధేం♦ద్రానీకముం జేరునే ?
కనదుద్దామపరాక్రమప్రథత! భ♦ర్గా ! పార్వతీవల్లభా ! 90

మ. ధరణిన్ సద్గురుచెంత నెందఱుఖలుల్ ♦దార్కొన్నచోఁ జేటికే
కరమర్థి న్బుధులేఁగుచుందురురు ని♦క్కంబారయన్ గంటకా
వరణోజ్జృంభిత కేతకీవని కళుల్ ♦ వాలెంబుగాఁ జేరనే ?
కరుణాదభ్రపయఃపయోనిలయ! భ♦ర్గా! పార్వతీవల్లభా! 91

శా. లోకానీకమునందు దుర్గుణులు క♦ల్మల్ గల్గియున్నప్డు ప
ల్గాకుల్ దార్కొని మెల్లమెల్లనె మరా♦లాపంబులం గేరుచుం
గై కొంఁ డెల్లపదార్థముల్నిజమహో♦కాక్ష్మాంతలం గ్రోల్చుచు
న్గాకు ల్వేములఁ జేరుచందమున భ♦ర్గా! పార్వతీవల్లభా! 92

మ. చదువు ల్వేదపురాణము ల్గయితలు♦న్సబ్బందువిద్దెల్ గతల్
మొదలెన్నేనిగ విద్దమాంసువుఁ దే♦మో తెల్పఁగావింటిఁగా
సదిగో చౌలకు మాలదాసరి శట♦కైగారి జ్ఞానమ్మలెన్
గదియం జాల వటంద్రు ముష్కరులు భ♦ర్గా! పాగ్వతీవల్లభా!

శా. ఔ! ఔ! బాఁపఁడ! దోసె దూద లిడినం♦బోలేక పేరాసల
న్వాపోఁజాగెతివేమి! నీసదువు తి♦ర్నామంబులో! సుద్దులో
భూపాళంబులో లంకసత్తెలో బలా ♦ బొల్గ్యావుపోట్లాటలో
కా! పాటింపనటంద్రు బాలిశులు భ♦ర్గా! పార్వతీవల్లభా! 94

మ. అదిగో బాఁపనయల్లుభొట్లయకు ముం♦దప్పయ్యతీర్థంబులో
నదనం "గిద్దేఁడుకొట్టినూక లిడితిన్ ♦ అబ్బబ్బ! తిర్నామముల్
సదువంజాగిన మాలదాసరయలన్ ♦ సంతోసనాల్ సేసితిం
గద" యుంచుంబలుమోటులాడుదురు భ♦ర్గా! పార్వతీవల్లభా!

శా. రాలన్ దైలము తీయవచ్చు భుజగ♦వ్రాతమ్ముల న్బేర్లఁగా
లీల న్బూనఁగవచ్చు నంబునిధి హా♦ళిం దాఁటఁగావచ్చు డా
కేల స్బెబ్బులిఁ బట్టవచ్చు విపినా♦గ్ని న్నిల్పఁగావచ్చు మూ
ర్ఖాళిం దెల్పఁ దరంబె యేరికిని? భ♦ర్గా! పార్వతీవల్లభా! 96

శా. ఆఁకొన్నప్పుడు వంటకంబయిన బి♦య్యంబైన జావైనఁగూ
రాకైన స్ఫలమైన నీరముయినన్ ♦ హాళిం గల ట్లిచ్చుచున్
జేకోనాఁ బరదేశులం గృహాలలకు ♦ న్సిద్ధంబు గాపింప ఛీ!
కాకన్న న్మతి యేఁటికొంప లవి? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. మడతల్వాల్లున్నపాలుతోఁ బలుమఱు♦న్మారాడు పెండ్లాముతోఁ
జెడుజాడం బ్రచరించునాత్మజునితోఁ♦జేటాపటుగోర్లెంకతో
బాడవంజూడఁగవచ్చుకార్మొదవుతోఁ♦బోరాడుచుట్టంబుతోఁ
గడతేరం దరమా గృహస్థునకు? భ♦ర్గా! పార్వతీవల్లభా! 98

శా. కాకిన్శాశ్వతజీవిగా నునిచి చి♦ల్కన్వేగ పోకార్చి సు
శ్లోకుం గొంచెపుటేండ్లలోఁ గెడపి దు♦ష్టుంబెక్కునాళ్లుంచి య
స్తోకత్యాగి దరిద్రుఁ జేసి కఠినా♦త్మున్ శ్రీయుతుంజేయు నా
హా! కొంకే దిఁక నల్వచెయ్యులకు? భ♦ర్గా! పార్వతీవల్లభా!

మ. ధరలో నెన్నఁగ శాలివాహన శకాబ్దంబు ల్దగ*న్యామినీ
కరబాణాంగశశాంకసంఖ్యఁ జెలువై కన్పట్టు (సౌమ్యా)హ్వ
య।స్ఫురదబ్దంబుననిమ్మహాశతక మేఁ బూర్ణంబుగావించి శ్రీ
కరలీల న్బుధు లెన్న నీ కిడితి భర్గా! పార్వతీవల్లభా! 100

మ. ధనధాన్యాంబరపుత్త్రపౌత్త్రమణిగోదాసీభటాందోళికా
వనితాబంధురసింధురాశ్వ(మహితైశ్వర్యంబు) దీర్ఘాయువు
ర్ఘనభాగ్యంబును గల్గి వర్ధిలుదు రేకాలంబుఁ జేటూటు లే
క నరుల్ దీని బఠించి రేని భువి భర్గా! పార్వతీవల్లభా! 101

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

* యామినీకరబాణాంకశశాంక (౧౯౫౧. శా. శ.)—అని వ్రాఁతప్రతి ప్రమాదయుక్తము 'అంగ' అనుటకు లేఖకుఁడు-అంక-అని వ్రాసియుండును. మఱియు, కవి కాలనిర్ణయాదులనుబట్టి యాలోచించినచో నిందుఁ జెప్పఁబడిన వత్సరము (శా. శ. ౧౬౫౧+౭౮=(క్రీ. శ.) ౧౭౨౯ అగుచున్నది. కాని, ఇదియుఁ బొసఁగునట్లు దోఁపదు.

## —♦ గ్రంథమాలోద్దేశములు. ♦—

1. అముద్రితాంధ్రగీర్వాణగ్రంథముల నచ్చొత్తించి భాషాసేవచేయుటయే మాముఖ్యోద్దేశము.

2. ప్రాచీనకవి విరచిత పుస్తకములకే ప్రాముఖ్య మీయఁబడును.

3. వత్సరమునకు నాల్గుపొత్తములవంతున ప్రకటింపఁ బ్రయత్నింతుము.

## —♦ నిబంధనలు. ♦—

1. సంవత్సరమునకు రు 25/- నొసంగువారు రాజపోషకులుగను, రు 10/- నొసంగువారు పోషకులుగను, రు 5/- నొసంగువారు సహాయులుగను బరిగణింపఁబడుదురు. వారినామధేయముల నీఁక ముందు ప్రచురింతుము.

2. సంవత్సరమునకు రు1/– సాధారణచందా నిర్ణయింపబడినది. వి.పి.లు అధికవ్యయకారణములగుటచే సాధారణచందా ముందుగఁ బంపుట మేలు ?

3. పోస్టుఖర్చులు మేమే భరింతుము.

వివరములకు:—అముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాల,
గెద్దనాపల్లి.
P. O. పెద్దాపురం. (తూర్పుగోదావరిజిల్లా.)

—♦ మాగ్రంథమాలయందు దొరకు గ్రంథములు. ♦—

| | |
|---|---|
| భర్గశతకము (కూచిమంచి తిమ్మకవి) | 0 4 0 |
| భక్తమందారశతకము (కూచిమంచి జగ్గకవి) | 0 4 0 |

'ప్రాచ్యభాషావిశారద' కూచిమంచి సుబ్బారావు ప్రణీతములు.

| | |
|---|---|
| రాణి రావు జగ్గమాంబ | 0 6 0 |
| రాణి రావు భావయాంబ | 0 8 0 |
| సింహాచలయాత్ర | 0 2 0 |
| శబరీమాహాత్మ్యము | 0 2 0 |
| సర్వే గైడు (సర్వేడిపార్టుమెంటువారికిని కరణములకు ఉపయోగముకొఱకు) | 0 8 0 |

హిందీపుస్తకములు.

| | |
|---|---|
| హిందీ తెలుఁగునిఘంటువు | 2 8 0 |
| నాగరలిపిలో శిశుబోధిని | 0 2 0 |
| ,, ప్రథమబోధిని | 0 3 0 |
| తెలుఁగులిపిలో మొదటిపుస్తకము మొదటిభాగము | 0 2 0 |
| ,, ,, రెండవభాగము | 0 2 6 |
| ,, రెండవపుస్తకము | 0 3 0 |
| శివస్తోత్రము (అపురూపము) చాగంటి రామచంద్రరావు సంపాదితము | 0 1 0 |

రాఁబోవు పుష్పము
సరసహృత్కుముదచంద్రిక
కూచిమంచి తిమ్మకవి.

అముద్రితాంధ్రగీర్వాణగ్రంథమాల,
B. O గెద్దనాపల్లి.
P O. పెద్దాపురం.
(తూర్పుగోదావరిజిల్లా.)